# పశ్చాత్తాపం

## (నాటిక)

డాక్టర్. జి. రాజారావు

ప్రజాశక్తి కార్యాలయం
:: బెజవాడ ::

# పశ్చాత్తాపం

(నాటిక)

డాక్టర్ జి. రాజారావు

ప్రజాశక్తి కార్యాలయం
గవర్నరుపేట : : బెజవాడ

# పరిచయం

ప్రజా విజ్ఞాన ప్రచారమండలి ఇటీవలనే ఆంధ్రలో స్థాపించబడింది. ఇది ఆలిండియా పీపుల్సు థియేటర్స్ అసోసియేషన్‌కు అనుబంధశాఖ. ఆంధ్రలో నన్ను ఆర్గనైజరుగా బొంబాయిలో 1943 మే లో జరిగిన ఆలిండియా పీపుల్సు థియేటర్ కాన్ఫరెన్సులో నియమించారు. దీని స్థానిక శాఖలు ఇప్పుడిప్పుడే వివిధగ్రామాలలో తలెత్తుచున్నాయి.

ఈ మండలి నాటకాలద్వారా, పాటలద్వారా, నృత్యాలద్వారా, బుర్ర కథలు మొదలగువాటి ద్వారా అభ్యుదయకరమైన పోకడను బలపరుస్తుంది. మన దేశ ప్రజాసామాన్యాన్ని సామాజికంగా, రాజకీయంగాను అభివృద్ధి పరచడానికి పాటుపడుతుంది. ఈ ఉద్యమం. మన మహత్తరమైన పురాతన సంస్కృతిని తోసిపుచ్చదు. మన సంస్కృతిని పునర్జీవి ప జేసి ప్రజాజీవితాన్ని చిత్రించి వారి అభ్యుదయానికి తోడ్పడుతుంది. స్వాతంత్ర్యం కోసం, దారిద్ర్య విముక్తికోసం, ప్రజాస్వామ్య విజ్ఞానం కోసం మన ప్రజలుగావించే పోరాటాల్ని వ్యక్తపరచడానికి హృదయపూర్వకంగా పనిచేస్తుంది. సామ్రాజ్యవాదం నుండి, ఫేసిజం నుండి, మన సంస్కృతిని నాశనం గాకుండా కాపాడుట, ఈ ఉద్యమ ఆశయాలలో ఒకటి. ప్రజా సామాన్యాన్ని ఎదుర్కొనే ప్రశ్నలు పరిష్కరించడానికి, ప్రజా ఐక్యతను నిర్మించడానికి పాటుబడుతుంది. న్యాయయుతమైన ఉత్తమ ప్రపంచాన్ని నిర్మించాలని ప్రజలకున్న గాఢవాంఛను బలపరుస్తుంది.

ఈ ఆశయాలతో పనిచేయుచున్న ఆంధ్రశాఖ తొలిప్రయత్నం ఈ నాటకం, ఇది కృష్ణాజిల్లా పోరంకిలో నాల్గువేల ప్రేక్షకుల మన్ననల పాత్రమైంది.

అయినా ఇదొక్కటే చాలదు. ఇంకెన్నో మన జీవితఘర్షణల చిత్రించి అభ్యుదయానికి త్రోవచూపే నాటకాలు కావాలి. అందుకు యువ అభ్యుదయ రచయితలు తోడ్పడాలని కోరిక.

ఇట్లు,

పోరంకి,
25—12—43.

డాక్టర్, జి. రాజారావు,
ప్రజా విజ్ఞాన ప్రచారక మండలి:
"ఆలిండియా పీపుల్సు థియేటర్సు ఎసోసియేషన్
అనుబంధశాఖ.

# స్టేజికి సూచనలు

నాటకాలు వేయడానికి ప్రతివూళ్లోను నాటకశాలలుండవు. కాబట్టి బహిరంగ ప్రదేశాలలను వేయవలసివుంటుంది. అందుకు స్టేజినిర్మాణాన్ని గురించి తెలుసుకోవడం అవసరం.

స్టేజిఎత్తు భూమినుండి 1½ అడుగులు ఉండాలి. బల్లలతోటిగాని, వెదురు వాసాలతోగాని, మట్టితోగాని నిర్మించవచ్చు. వెడల్పు 15 అడుగులు, పొడవు తొమ్మిది అడుగులు, ఎత్తు 7½ అడుగులు. సైడుకర్టెన్లు ఒక్కొక్కొటి 3 అడుగులు వెడల్పు చొప్పున 7½ అడుగులయెత్తు ఉండాలి. శబ్దం హెచ్చుజేయడానికి నాలుగు కుండలు పందిరిమీద బోర్లించాలి. ముందు ప్రేక్షకులకు అవి కన్పించకూడదు.

తెరలు సీనరీతో అద్దెకుతేవడం కష్టం. తెచ్చినా ప్రతిదృశ్యానికి సరిపోయే తెరలూ లభ్యంగావు. అందుచే ఆయా దృశ్యాలలోని ప్రధానభావాలను, రసాలను ద్యోతకం జేసేవిగా మాత్రమే రంగుల తెరలుండాలి.

ఉదా :—యుద్ధం, క్రోధం, వైరం : ఎర్రతెర ; శాంతం : తెలుపు ; శృంగారం : గులాబీ ; కల్యాణం : పసుపు ; దుఃఖం, కుట్ర : నలుపు .

# పాత్రలు

రావు : విద్యార్థి, 25 సంవత్సరాలు. సుగుణను ప్రేమించాడు.

సుగుణ : విద్యార్థిని, 18 సంవత్సరాలు. రావును ప్రేమించింది.

వీరయ్య : రావు తండ్రి. ముక్కోపి, ఛాందసుడు. 50 ఏళ్లు.

రంగమ్మ : రావు తల్లి. పల్లెటూరి స్త్రీ. 40 ఏళ్లు.

మోహన్: మరొక విద్యార్థి. 30 సంవత్సరాలు. సుగుణను ప్రేమించి తిరస్కరించబడ్డాడు.

సంగయ్య : మోహన్‌కు అండగా నిలిచిన పల్లెటూరి రౌడీ. 22 ఏళ్లు.

పేరయ్య : పెళ్ళికూతురువారి తరఫున వచ్చిన బంధువు. 24 ఏళ్ళు. నత్తి.

వెంకడు : 40 ఏళ్లు. వ్యవసాయ కూలీ.

దాసు : కాంగ్రెసు వాది. 35 ఏళ్ళు.

ఇంకా పిల్లలు, పాటలుబాడే బాలబాలికలు, అధ్యక్షుడు, డాక్టరు, కాంపౌండరు మొదలైనవారు వస్తారు.

# ప్రదర్శన సన్నాహం

| రంగం | నటకులు | తెర | వస్తువులు |
|---|---|---|---|
| 1 | మోహన్, సుగుణ, రావు. | ఎర్రి | పుస్తకాలు, పత్రికలు, 2 కుర్చీలు, 1 టేబిల్, పుస్తకాల షెల్ఫ్, సిగరెట్స్. |
| 2 | వీరయ్య, రంగమ్మ, రావు, సుగుణ, పేరయ్య, ఇద్దరు పిల్లలు. | పసుపు | మిఠాయి, తోరణాలు, ఉత్తరం వ్రాసిన కాగితం ముక్క. |
| 3 | మోహన్, సంగయ్య ఊరేగింపుకు కావలసిన జనం. ఒకరు బాగాపాడేవారు. | నలుపు | సిగెరెట్, కవరు, ఎర్రిజండాలు రూపాయి నోట్లు. |
| 4 | వీరయ్య, రంగమ్మ, వెంకడు, మోహన్, సంగయ్య, రావు. | ఎర్రి | కవరులో ఉత్తరం. |
| 5 | మోహన్, సంగయ్య, దాసు. | తెలుపు | సిగరెట్లు, కొంకె కర్ర, నిప్పెట్టె, సిగరెట్టు |
| 6 | అధ్యక్షుడు, రావు, సుగుణ, మోహన్, దాసు, సంగయ్య, బాలిక, బాలుడు, ప్రేక్షకులు, | ఎర్రి | కుర్చీ, టేబిల్, ఎర్రజండాలు, దుడ్డు కర్ర, ఎర్రరంగు, స్పాంజ్. |

| రంగం | నటకులు | తెర | వస్తువులు |
| --- | --- | --- | --- |
| | మోహన్ మొ॥ వాళ్ళను ఎదుర్తొని మాట్లాడే ప్రేక్షకుడు. | | |
| 7 | వీరయ్య, రంగమ్మ, ఒకరు. | ఎర్ర | .... |
| 8 | వీరయ్య, రంగమ్మ, డాక్టర్, కాంపౌండరు, రావు, సుగుణ | నలుపు | నులకమంచం, మందులపెట్టె. |
| 9 | మోహన్, సంగయ్య, ఒకరు, ఇద్దరుపోలీసులు | ఎర్ర | సిగెరెట్లు. |
| 10 | వీరయ్య, సుగుణ, రావు. | పసుపు | ... |

## గ మ ని క

ఇందులో "ఎగురవేయి" అనే పాట

కొగంటి గోపాలకృష్ణయ్యగారిది.

# మొదటి రంగం

[ చెన్నపట్టణం. సుగుణగది. సుగుణ కాలేజీ విద్యార్థిని. నిరాడంబరమైన వేషం. పుస్తకాలు అటూ ఇటూ సర్దుతూ పాడుతూవుంటుంది. టేబిల్, కుర్చీ, పుస్తకాలషెల్ఫ్, పత్రికలు వగైరా గదినిండా వుంటాయి. ]

పాట

రావోయీ విద్యార్థీ! రణరంగానికి
రావోయీ నిద్దుర లేవోయీ॥

నీ సరిహద్దుల నిలచియున్నదీ
నీచ జపాను పిశాచీ ॥రావోయీ॥

శాంతి స్వాతంత్ర్య అభ్యుదయమ్ములె
పరమావధి నీకని యెంచుమురా ॥రావోయీ॥

మోహన్:— (ప్రవేశం) హలో! గుడ్ ఈవెనింగ్ మిస్ సుగుణా! నన్ను నీవు డిసపాయెంటుచేశావ్. నీ కోసం చూసి చూసి కళ్ళు నీళ్ళుకారాయి. ఆ వుత్సవం అంతా నిరుత్సాహంగానే వుంది.

సుగుణ:— క్షమించు మోహన్. నేను రాలేకపోయాను. నిలబడ్డావేం, కూచో. ఆఁ. విద్యార్థి సంఘాల పనియేదో వుండడంవల్ల రాడానికి వీలుపడిందికాదు.

మోహన్:— (కూర్చోమనగానే కూర్చుంటాడు) అబ్బా! సుగుణా! ఎందుకొచ్చిన సంఘాలివి. హాయిగా కులాసాగా వుండకూడదూ? నీకు వచ్చే లాభంయేమిటి? రాత్రింబవళ్లు నిద్రాహారాలు మాని, శ్రమించడం తప్ప. ఇంతకూ నీకు వాడొకడు దాపురించాడు. ఆ రావువల్లే పూర్తిగా పాడైపోతున్నావు.

సుగుణ:— మోహన్! నీకెన్నిమార్లో చెప్పాను అతని
నీ కిష్టమైతే అతని పంథాను నడుపు. లేదా వైదొ
చూస్తే నవ్వువస్తుంది. ప్రపంచం అంతా య
తగుల్కొన్నదనీ, మన మాతృభూమి పొలిమేర
పొంచివుందనీ తెలియని - తెలిసినా తెలియనట్లు ప్ర
నిన్నుతప్ప మరెవ్వరినీ చూడలేదు. దేశంయెడల,
యువక విద్యార్థులమైన మన కర్తవ్యం యేమిటో క
చడం లేదుకదూ?

మోహన్:— ఇక లెక్చరర్ కట్టిపెట్టు. నేనేం పసిపిల్లకాయ
తెలియకకాదు. అన్నీ తెలుసు. అయినా ఎందుకు
ఇదంతా. జైళ్లు-లాఠీదెబ్బలు - ఇవన్నీ నాకిష్టంలేదు.
తలో సుఖంగా గడపడం నా జీవిత ఆశయం, ఇ
జూచిగాని లేకపోతే అదీలేదు. నీకోసం....

సుగుణ:— నాకోసం?

మోహన్:—నీ వే సంఘములో చేరమంటే ఆ సంఘంలో
ఊరేగింపులకు రమ్మంటే వస్తున్నాను. కాగితాల
పంచుతున్నాను.

సుగుణ:— ఎందుకుబాబా నామీద అంత దయ!

మోహన్:— దయకాదు - ప్రేమ.

సుగుణ:— (కఠినంగా) ఏమిటీ?

మోహన్:— షరి.... నా మాటేమిటి సుగుణా?

సుగుణ:— నా కర్థంకావడంలేదు నీవైఖరి.

(పెదమొగం పెడుత

మోహన్:— రోజులు గడిచాయి. మాసాలు దాటినాయి. సంవత్సరాలు పరుగెత్తుకపోయాయి. విద్యార్థి జీవితంనుండి విముక్తిచెందే రోజులుకూడా దగ్గరకు వచ్చాయి. కాని నామీద కరుణరాలేదు సుగుణా! (చేయిపట్టుకుంటాడు. విదలించుతుంది) నా యీ నిర్మల ప్రేమను నిరాకరించవద్దు.

సుగుణ:— ఛీ! ఛీ!!

మోహన్:— నిజం. హృదయపూర్వకంగా ప్రేమించాను. నన్నగాధంలో కూలత్రోయవద్దు. నీ వే పనిచేయమన్నా తయార్, నా కిష్టంలేని రాజకీయాల్లో దిగమన్నా దిగుతాను. చివరకు మీ పార్టీలో చేర మన్నా చేరతాను.

సుగుణ:— ఏడిశావ్! పార్టీ గాడిదల కాయడంలేదు. (కొంచెంసేపాగి) క్షమించు మోహన్. కటువుగా అన్నాను. కాని నిజం చెప్పవలసి వస్తే. ఇదివరకే నా హృదయం మరొకరిపై లగ్నమైవుంది.

మోహన్:— (నిశ్చేష్టుడై ఆగి, తర్వాత) ఎవరిపైన- ఎవరిపైన- రావును ప్రేమించలేదు కదా?

సుగుణ:— అది నీ కనవసరం.

మోహన్:— (కొంచెం తేరుకొంటాడు. వెక్కిరింపుగా) రావు! అబ్బో! నీ దృష్టిలో అతడు విద్యార్థి కష్టాలను నిర్మూలించ ప్రతిజ్ఞ బూనిన వీరుడు! దేశ దాస్యవిముక్తికి కంకణం కట్టుకున్న యోధుడు. అంతేగాదు— భావిభారత రాజ్యాంగభారం అంతా తన భుజస్కంధాలపై....తర్వాత నాకా ఉపన్యాసధోరణి రావడంలేదు సుగుణా— హ్హా—హ్హా—హ్హా. (వికటంగా నవ్వుతాడు.)

సుగుణ:— మోహన్! నా కాలం వృధాపరచకు.

మోహన్:— అయితే నన్ను దయచేయమంటావా?

సుగుణ:— అవును ముమ్మాటికి. మంచిగా చెప్ప
రాగాన పడుతోంది. నీలాంటి భోగలాలసుల
హృదయంలో స్థానంలేదు.

మోహన్:— సుగుణా! తర్వాత విచారించితే లాభ
సుఖపడే దేమిటి? నిన్ను జైళ్ళకు లాక్కొళ్ల
వూరూరా త్రిప్పుతాడు. ఆఖరికి కూటికి
వస్తుంది. ఆలోచించుకో!

సుగుణ:— (వెటకారంగా, కృత్రిమభయాన్ని చూప
గనా! (అని నవ్వుతుంది.)

మోహన్:— వేళాకోళం కాదు. నన్ను నిరాకరించి
జరుగుతుంది సుమా!

సుగుణ:— ఇలాంటి బెదిరింపులకు లొంగే మహి
తమరు దయ........

మోహన్:— దయచేస్తాను. మంచిది. దయచేస్తాను
డికి పోతారు. మీకు రాజకీయాలే ప్రాణతుల్య
ప్రవేశించి మీ పని పడతాను. (విసురుగా బ
దారి కడ్డంవచ్చిన రావును.......

రావు:— (ఎదురుగా వస్తాడు. రావు మోహన్ భు
రావు ఆశ్చర్యంగా తప్పుకుంటాడు.)

మోహన్:— హుం. (అని విసరుగా వెళ్ళుతుంటా

రావు:— (లెక్కచేయకుండా వచ్చి) సుగుణా, ఎం
పోతున్నాడు?

సుగుణ:— (నవ్వుతూ) అతని ప్రేమ రాస్తాలో నీ
కీయరంగంలో దిగి మనకడ్డుపడి పగతీర్చుకొ

రావు:—అదా సంగతి! బోధపడింది. పిచ్చివాడు. పో

సుగుణ:— అది సరేకాని, మనప్రయాణం ఎప్పుడు ? నాన్నగారినుండి అనుమతికూడా వచ్చింది. పది పదిహేను రోజులుండి రమ్మన్నారు. ఆయనకంతా బోధపడినట్లుంది చూస్తే.

రావు:— ఆయనకేం. మహా ఉదాత్తుడు. మా నాన్నలాంటి మొండివాడు కాదు.

సుగుణ:— అయితే నన్నక్కడికి రమ్మంటున్నా వెందుకు బాబూ ?

రావు:— ఇతర విషయాలలో ఎంత కఠినుడైనా నీ విషయంలో కూడ అలా ప్రవర్తించుతాడా ? ఏం భయంలేదు. రేపే వెళదాం.

— తెర —

# రెండో రంగం

[వీరయ్య—బోనులోపడ్డ పులిలాగా తిరుగుతూ వుంటాడు. పిల్లలు ఒకటి రెండు సార్లు మిఠాయి తింటూ స్టేజీమీదుగా వెళ్ళుతారు. తోరణాలు—అంతా పెండ్లి వాతారణం. వీరయ్య కొత్తబట్టలు వేసుకొని తలపాగాతో సిద్ధం.]

వీరయ్య:— యేమేవ్....వాసేవ్....రావేమే.

రంగమ్మ:— (తెరలోంచి) వస్తున్నా !

వీరయ్య:— యేంజేస్తున్నావే లోపల ! ఎన్నిసార్లు పిలిచేది.

రంగమ్మ:— (బయటికి వచ్చి) మరి అబ్బాయి ?

వీరయ్య:— అబ్బాయి. గిబ్బాయి. యీడికోసం చూసి చూసి విసుగుపుడతా వుంది. రేపు పెళ్లి. అసలీపాటికి పెళ్ళివారింటికి వెళ్లుండాల్సింది. అసలు వాడు వస్తాడో, యెగేస్తాధో ? వాడి అజాపజా లేదాయె. నా మాట దబ్బరై పోతుందేమో ? మళ్లా నల్గురిలో తలయెత్తుక తిరగగలనా ? యీడి కామాత్రం జ్ఞానం ఉండనక్కర్లే.

రంగమ్మ:— ఆఁ యేమిటాతొందర. వస్తాళ్లే. అయినా మీరు వ్రాసిన వుత్తరం అందిందో లేదో ? మీదంతా పెద్దగోల !

వీరయ్య:— యేమిటి నీ వెర్రి ! వాడికి వ్రాసి అప్పుడే పదిహేను రోజు లయింది. జవాబుకూడా ఏడ్చాడుగా నిన్నే వస్తానని. మద్రాసుల్లో యెందుకుచెప్పు డబ్బు ఖర్చుపెట్టుకు కూర్చోడం. నేను నానాకష్ట పడి సంపాదించడం. వాడు ఇష్టమొచ్చినట్లు జల్సావుడాయించడం.

రంగమ్మ:—అసలు సెలవులిచ్చారో ! లేదో !

వీరయ్య:— నీదంతా మందమతి. సెలవులీయందే లగ్గం పెట్టించానను కొన్నావు! వాడి తోటివాళ్లొచ్చి ఎన్నాళ్ళయింది? యీడికేం తెగులు చెప్పు....

రంగమ్మ:— ఏంటండీ ఆ మాటలు— శుభమా అంటా పెండ్లి— మీ మాటలు చూస్తే వొళ్లమండుతోంది. ఇంకేం సాధిస్తారులెండి. పరీక్ష లయి పోయాయి. ఇంటిదగ్గరే వుంటాడుగా ఇక. అయినా మీరేదో గంపత్రవ్వి తలకెత్తినట్లు మాట్లాడుతున్నారే. నా మెడలో నల్లపూసైనా లేకుండా నగలన్నీ అమ్మి చదువు చెప్పించింది నేనేగా (మూతి విరుస్తుంది.)

వీరయ్య:— చెప్పించావులే మహా!

(తెరలో) వీరయ్యబావా! ఇటురా! ఆ బజంత్రీవాళ్ళు పేచీపెడుతున్నారు.

వీరయ్య:— ఇదుగో వస్తున్నా. (వెళతాడు)

(తెరలో) రంగమ్మత్తా! ఇలా ఒకసారిరా.

రంగమ్మ:— వస్తున్నా. (వెళుతుంది)

[రావూ, సుగుణల ప్రవేశం.]

సుగుణ:— అబ్బా! ప్రయాణం మహాటీడియస్‌గా వుంది. ఈ మూడు మైళ్ళూ ఆ బండి పెళ్ళినడక నడిచింది.

రావు:— ఇంకా నయం, ఏదో అనుకున్న టైముకు వచ్చింది. లేకపోతే మా నాన్న నా పెళ్ళి చేసేవాడే. ఆయన ఉత్త గాభరామనిషి. ఎందుకు రాలేదో ఏమిటో అని మహాతొందర పడతాడు.

సుగుణ:— (నవ్వుతూ) నిజంగానే నీ పెళ్ళి అయేటట్లుంది. (పైకిచూచి) ఈ తోరణాలు అవీ....

రావు:— తోరణాలా? (ఆశ్చర్యంగా చూస్తాడు) ఇదేంటిచెప్మా. ఏదో నోములు నోచారనుకొంటాను.

రంగమ్మ:— (ప్రవేశం.) ఏంరా నాయనా! ఇంత ఆలస్యం చేశావేం నాన్న వుత్తరం అందలా? ఆయన ఊరికే తొందరపడుతున్నారు. ఇప్పటికీ మించిపోయింది లేదులే. ఎంత చిక్కిపోయావు? హోటలు భోజనం. అందులోను బియ్యం దొరకడం లేదటగా! (ఇంత వరకు సుగుణను చూడదు. ఇపుడుచూచి) ఓ. నిన్ను చూడలే దమ్మాయి. పాడుతొందర. దగ్గరమనుష్యులే కన్పించడంలేదు. లక్ష్మయ్య అన్నయ్యగారి అమ్మాయివికదూ. మావాడు అప్పుడపుడూ చెబుతూ వుండేవాడు. రా అమ్మా. స్నానం చేద్దుకాని. అబ్బాయి నీవుకూడా, తలంటుకొంటావా? ఉత్త స్నానంచేస్తావా? ఈకాలపు వాళ్లకి అవన్నీ లేవుగా! పద అమ్మాయి. (పోబోతారు.)

రావు:— ఏమిటో ఇదంతా నా కర్థం కావడంలేదు. ఇంతకూ ఎవరిపెళ్లే అమ్మా!

రంగమ్మ:— ఏం ఎగతాళిరా నాయనా! పద అమ్మాయి. వాడిమాటలకేం. (వెళ్ళుతుంది. సుగుణ ఆశ్చర్యంతో మౌనంగా అనుసరిస్తుంది)

వీరయ్య:— (ప్రవేశిస్తూ) ఎవరిపెళ్ళేమిటిరా? నీదే.

రావు:— (కోపంతోను - అవమానంతోను) నాన్నా! నాకు తెలియజేయ కూడదూ? నాతో ఒక్క మాటన్నా అనగూడదూ? నాకు తెలియ కుండానే నాకు పెళ్ళా?

వీరయ్య:.... దానికంతా కథ వుందిలేరా! చక్కనిపిల్ల. సంగీతం నేర్చు కుంది. మంచి ఆస్తిపరులు. వేయిన్నూటపదహార్లు కట్నం. అయి దెకరాల మాగాని నీపేర పెడతారట. నీకు వుత్తరం వ్రాయలేక కాదు, ఈరోజులు ఎలాంటివి? మళ్ళా ఈ ఛాన్సు దొరుకుతుందో లేదో అని, రెండోచెవిని పడకండా గప్‌చిప్‌గా సిద్ధంచేశాను.

రావు:— నాన్నగారూ! నా తల తిరిగిపోతోంది. మాటమాత్రం సంప్రదించగూడదూ?

వీరయ్య:— (కోపంతో) ఏమిటిరా నీతో సంప్రదించేది ? పెద్ద మొన గాడివని సంప్రదించాలా యేమిటి ? పెంచి పెద్దవాణ్ణిజేసి విద్యా బుద్ధులు చెప్పించినందుకు సొడ్డా ఇది ?

రావు:— అదికాదు నాన్నా !

వీరయ్య:— ఏంకాదు; ఎంతడబ్బు తగలేశాను ? పెండ్లిచేసే అధికారమే లేదటరా నాకు ? దానెమ్మ కడుపుకాల, ఇదేం స్వాతంత్ర్యంరా ! ఇంతకూ నేనుమాత్రం ఏ కుంటిదాన్నో, గుడ్డిదాన్నో తెచ్చి కట్టి పెడుతున్నానుగనుకనా ? నీకంటె అందంగానే వుంటుంది పిల్ల.

రావు:—. అందంకాదు నాన్నా. వివాహం అంటే స్త్రీ పురుషులిరువ్వురూ యావజ్జీవం........

వీరయ్య:— కట్టిపెట్టవోయ్ నీ ఉపన్యాసం. అనవసరంగా నా కప్రదిష్ట తేబోకు. నాకవతల పనివుంది. పోయి స్నానంచేయి.

(విసురుగా వెళతాడు)

రావు:— (తలపట్టుకొని కూర్చుంటాడు )

రంగమ్మ:— (చీటీపట్టుకుని ప్రవేశించుతుంది) అదేమిట్రా ! అలాకూర్చు న్నావు ? ఆ అమ్మాయి వెళ్ళిపోయింది, ఒక్కక్షణమైనా ఉండటం మంచిదికాదంటూ పోయింది. ఎంత బ్రతిమాలినా వినలేదు. నీతో చెప్పి వెళ్ళమన్నాను. వినలేదు. ఈ చీటీ యిచ్చింది.

రావు:— (చీటీ గబగబా చదువుతాడు) మిత్రమా ! సంగతులన్నీ బోధ పడ్డాయి. నన్ను మరచిపో. సెలవు !

(రంగమ్మ గడ్డంకిక్రింద చెయ్యిపెట్టుకొని చోద్యంగాచూస్తుంది)

రావు:—అమ్మా ! ఇక్కడెవరిదన్నా సైకిలుందా-వెళ్ళివస్తాను (పోబోవును)

రంగమ్మ:— (భుజంపట్టుకులాగి) ఏడ్చినట్టేవుంది; ఏమిటారి ఇదంతా. రాత్రికి లగ్నం. అందరూ సిద్ధంగావుంటే, నీవేమో ఆ పిల్లకోసం

పరుగెత్తుతానంటావు. ఇప్పటికే యిల్లంతా గప్పుమంది. ఇకనైనా మన పరువు నిలబెట్టు నాయనా! (గడ్డంపుచ్చుకొని బ్రతిమాలుతుంది. రావు కూలబడి కూచుంటాడు)

[పేరయ్య ప్రవేశం: పెండ్లికూతురు తరఫున పెండ్లికొడుకును ఆహ్వానించ్డానికి వచ్చాడు. బుగ్గమీసాలు; నత్తి; పల్లెటూరి అమాయకత్వం.]

రంగమ్మ:— (పలకరిస్తూ) రా! అబ్బాయి. మేం తొందరలోనే వున్నాం. కాళ్ళకు నీళ్ళిచ్చారా! అరే రాముడూ! అబ్బాయిగారికి నీళ్ళివ్వరా!

పేరయ్య:—అ అ అ అన్నీ అయినవిలెండి. మ మ మర్యాదకేంలోటులెండి,

రంగమ్మ:— అబ్బాయి రావడం ఆలస్యమయింది. అంచేత తొందరగా రాలేకపోయాం. అంతమాత్రానికి మీరు రావాలా?

పేరయ్య:—దా-దా-దానికేంటమ్మా! ఏదో కారణంవుంటుందని మే-మే-మే మనుకుంటూనేవు-వున్నాం. (రావువంక ఎగాదిగా చూస్తూఉంటాడు. రావు మొగం తిప్పుకుంటాడు. పేరయ్య కంగారుపడతాడు.) యే-య్యేమండీ! పరీక్షలు బాగా రాశారా! (రావు పలకడు)

రంగమ్మ:— అలా మంచంమీద కూర్చోండి. అబ్బాయి స్నానంచేసి ఇపుడే వస్తాడు. (రావుతో) అబ్బాయీ! పద. (రావు విసురుగా తల్లిని అనుసరిస్తాడు. పేరయ్య కంగారుపడతాడు.)

(తెరలో బిగ్గరగా సంభాషణ. పేరయ్య సైడువద్దకు వచ్చి వింటూ తలడింపుతూవుంటాడు. "అయితే నీవు చేసికోవన్నమాట. కాదన్నమాట. నా పరువు గంగలో కల్పుతావురా?" అని వీరయ్య పెద్దగా అరచిన మాటలు వినబడతాయి. ఇంతలో రావు గబగబా బయటికివస్తాడు.)

రావు:— అయ్యా క్షమించండి. మా నాన్నగారు నాకు తెలియకుండా ఈ వివాహాన్ని నిర్ణయించారు. నా హృదయాన్నిదివరకే ఒకరి కర్పించాను. (పేరయ్య కంగారుపడతాడు) ఆమెను తప్ప మరెవ్వరినీ పెండ్లియాడను.

వీరయ్య:— (కోపంతో విసురుగా ప్రవేశం) నా కొంప ముంచావురా ఆ పెద్దమనిషిని అగౌరవపరుస్తావటార్రా. నీ మొహంచూస్తే పంచ మహాపాపాలు చుట్టుకుంటాయిరా. ఇంత వెధవవి అవుతావను కుంటే పట్నంపంపేవాణ్ణా. సిగ్గులేకండా హృదయాన్నిచ్చివేశా నంటావ్! హృదయం - నీ మొహం.

రంగమ్మ:—(పరుగెత్తుకొచ్చి) ఏమిటండిదంతా. అవతల పెద్దమనిషి....

వీరయ్య:— ఛా! నోరుముయ్. వెధవముండా! నీ బుద్ధులే వచ్చాయి వాడికి. పోతావా పోవా? (రంగమ్మ లోపలికి పోతుంది)

(పేరయ్య నెమ్మదిగా జారుతూవుంటాడు.)

రావు:— మీ యిష్టంవచ్చినట్లు వాగండి. (వెళ్ళిపోతాడు)

వీరయ్య:— (పేరయ్యతో) అల్లుడుగారూ! వుండండి. ఏదో వాణ్ణి సర్ది తీసుకొస్తాను.

పేరయ్య:— ఛా-ఛా-ఛాల్లేవయ్యా! మ-మ-మహమ్మంచి సంబంధమే దొరికింది. ఇ-ఇలాంటి దనుకోలేదు. వు-వు-వుండనిక.

(కొంత స్పీడ్ ఎక్కించినడుస్తాడు. వీరయ్య బ్రతిమాలే పోజులో వెంబడి పడతాడు.)

# మూడో రంగం

(మోహన్ - సంగయ్యల ప్రవేశం)

మోహన్:— సంగా!

సంగ:— యేంమామా!

మోహన్:— ఇక్కడెవ్వరూ లేరుకదా

సంగ:— లేకేంమామా!

మోహన్:— ఎవర్రా?

సంగ:— నువ్వూ, నేనూ, హి హ్హి హ్హీ!

మోహన్:— ఏడ్చినట్లేవుంది నీ హాస్యం - కాని రావుసంగతులేమిట్రా?

సంగ:— వచ్చి నెల్లాళ్ళయిందో లేదో ఏంపని చేస్తున్నాడనుకొన్నావు. కూలీ సంఘాలు, రైతుసంఘాలు, యువజనసంఘాలు పెట్టేశాడు. ఇదంతా ఎందుకు? పిల్లసంఘాలు మొదలుకొని ఆడసంఘాలదాకా పెట్టేశాడు మామా?

మోహన్:— మనంకూడా పెట్టాలిరా!

సంగ:— తిండిబోతు సంఘాలా మామా? మనకెందుకొచ్చింది?

మోహన్:— నోరుముయ్ వెధవా! రావు ఎన్నిసంఘాలు స్థాపించాడో మనం అన్నీ స్థాపించాలిరా! సరే కాని రావు పెళ్ళేమయింది?

సంగ:— నీకు తెలవలా? ఆ మనుం తిరగ్గొట్టాడుగా! తీరా పీటలమీద పెండ్లి పోయిందిగా. అది సరేకాని, ఆవాళ ఎవరో అమ్మాయి వచ్చింది. రావు దాన్నుంచుకొన్నాడటగా?

మోహన్:— ఛీ నోరుముయ్, అలాంటిదేమీ జరగలేదు. పెళ్ళి జేసుకోవ
లనుకున్నాడు. కాని వాడిమొఖం. వాడివల్లేమవుతుంది. ఆ అమ్మా
యిని మనం.... (హుషారుగా మీసాలు తిప్పుతాడు.)

సంగ:— పెళ్ళి చేసికొంటాం అన్నమాట ! హ్హి హ్హీ హ్హీ

మోహన్:— వెధవా ! మనం చేసుకోవడం ఏమిట్రా ! నాకు....

సంగ:— పెళ్ళవుతుందన్నమాట.

మోహన్:— ఇడియట్ - బుర్రలేదు, (చెవియొగ్గి) సంగా! ఆగోల ఏమిటి?

సంగ:— (తేరి పారచూచి) రావు ఏదో ఊరేగింపుతో వస్తున్నాడు.

మోహన్:— అలాగా ! అయితే మనం ప్రక్కకు తప్పుకొందాం. వాడు
కనపడితే ఏదో మాట్లాడించాలిసి వస్తుంది.

(ఇద్దరూ తప్పుకుంటారు. ఊరేగింపు ఎర్రజండాలతో వస్తుంది.)

పాట

ఏకమై మనమేకమై మన రాజ్యమంతా ఏలుకొందాము ॥
కూలీ రైతు సోదరులంతా ఏకంబైతేను
కార్మిక కర్షక వర్గమువనమూ కలసీయుంటేను
హిందూ ముస్లిం జాతీయంతా ఒక్కటైతేను
మనరాష్ట్రమంతా ఒక్కటైతేను
మనదేశమంతా ఏకమైతేను
ఏలుకుందామూ
మనమేలుకుందామూ ॥ ఏకమై ॥

(జయ జయ ధ్వానాలతో ఊరేగింపు వెళ్ళిపోతుంది. సంగయ్య,
మోహన్‌లు మళ్ళా రంగంమీదికి వస్తారు.)

మోహన్:— ఒరే సంగా ! ఇది మంచిసమయంరా ! రావు మీటింగుగొడ
వలోపడి వుంటాడు. మనం వాళ్ళింటికి వెళ్ళి పురెక్కించాలి.

సంగ:— ఎక్కించాల్సిందే ! సిగెరెట్ ఏదీ

మోహన్:— (సిగరెట్టిచ్చి) ఇదిగో ఒకపనిచేయి. నేను ముందువెళ్ళి వీరయ్యతో మాట్లాడుతూ వుంటాను. (ఒక కవరిచ్చి) ఇదినీవు వెనకాత్తే పట్టుకరా! తర్వాత కధంతా నేను నడుపుతాను. ఆకవరు రావుకిమ్మని సుగుణ వాళ్ళూరు వెళ్ళినప్పుడు ఇచ్చిందని చెప్పు. తెలిసిందా?

సంగ:— తెలిసింది. కాని ఇదంతా తెలిస్తే వీరయ్య - మహా కోపిష్ఠి- వీపు విమానంమోత మ్రోగుతుందేమో?

మోహన్:— అలా జడుస్తావేంటిరా! ఇదిగో (నోట్లు చేతికిస్తాడు.)

సంగ:— హ్హి హ్హి హ్హి. మనం జడుస్తామా, మామా!

(ఇద్దరూ వెళ్ళిపోతారు—)

—తెర—

# నాలుగో రంగం

(పీరయ్య అటూ ఇటూ పచారుచేస్తూ వుంటాడు.)

పీరయ్య:—యేమేవ్! వశేవ్! ఏంచేస్తున్నావే? (రంగమ్మవస్తుంది) చూశావా అంట. మీ అబ్బాయి చేసేపనులు చూశావా అంట. గూడెంలో మాల మాదిగలతో కలిసి ప్రచారం చేస్తున్నాడట, ఏదో సంఘాలంట. వాడి పాడెంట - పచ్చిబద్దలంట - వాడి పిండాకూడంట! నేనూ ఊళ్ళో తలయెత్తుకొని తిరగలేకుండా వున్నాను. అందరూ తిట్టడమే గద! మీవాడు చెడిపోతున్నాడయ్యా అని. అందరూ మందలించడమేగద. కుదిర్చిన సంబంధం వదులుకొని పెళ్ళీ పెటాకులు లేకండా అడ్డగాడిదలా తిరగడానికా నేనీ చదువు చెప్పించింది. యేడీ : రానీ! ఇవ్వాళ అటో ఇటో తేలిపోవాలి.

రంగమ్మ:— ఈ భాగోతానికేనా ? పెద్ద పనివున్నట్లు పిలిచారు. నాచెయ్యి ఊరుకోలేదు. పోవాలి. (వెళ్ళిపోతుంది.)

(వెంకడు ప్రవేశం)

వెంకడు:— దండాలండి దొరగారు!

పీరయ్య:— ఏంరా! ఏంవచ్చావు? ఏంటో సంఘాలేదుస్తున్నారటగా ?

వెంకడు:— ఆఁ. ఏదోలెండి - దేశమంతా వుండాయిగా.

పీరయ్య:— యేడ్చావ్! నీకూలి ఎంతియ్యాలి? మూడురోజులా? మూడు అరణాలు రూపాయిబేడ.

వెంకడు:— అదేమిటండీ బాబయ్యా! రోజుకుపదణాలైనా ఈయాలి. బస్తా పదీపదకొండు అమ్ముతుండె. రూపాయికి అణాఅన్నా ఇయ్యొద్దూ. ఖేమూ ఇదివర్లాగా కాదయ్యో. నిక్కచ్చిగా ఏడుగంటలు చేస్తుంటిమి.

వీరయ్య:— ఓహో! తొండముదిరి ఊసరవిల్లి అయిందే. ఉపన్యాసాలు కూడా నేర్చావ్, ఎవడ్రా ఇదంతా నీకెక్కించింది.

వెంకడు:— ఎక్కించడం ఏముందండి. అబ్బాయిగారు- చదువుకొన్నార్ట కూడా- నాయం అన్నారు.

వీరయ్య:— ఏంటీ! అయిందీ! ఏమేవ్! విను. (ఇంటివైపు చూస్తాడు. లోపలనుంచి "వస్తున్నా" అని శబ్దం.) విను. అబ్బాయిగారు కొంపకే ఎసరుపెడుతున్నారు! ఆడముండవు నీకేం తెలుసు. (మోహన్ వస్తూవుంటాడు. విద్యార్థి దుస్తులుగాక సాధారణ దుస్తు లుంటాయి.)

(వెంకడితో) పోరా! ఎవరో పెద్దమనుష్యులు వస్తున్నారు. అనక్క కనపడు. నే నిచ్చేదేంటో ఇచ్చేస్తాను.

వెంకడు:— పదణాలు తప్పవులెండి.

వీరయ్య:— ఏడ్శావులే. ఈ వూళ్లో ఎవడ్రా యిచ్చేది. (మోహన్ ప్రవే శం. అతనివంక తిరిగి) మన దేవూరండి. గుర్తుపట్టలేదు. (ఇం ట్లోకి జూచి) వసేవ్! కాళ్ళకు నీళ్ళు తీసుకురా!

మోహన్:— అక్కర్లేదు లెండి. మావాళ్లింటికి వచ్చానులెండి. నన్నె ప్పుడూ చూచివుండరు. నేనూ మీ అబ్బాయి మద్రాసులో చదువు కొన్నాం లెండి.

వీరయ్య:— (అనుమానంగా) అయితే తమరుకూడా ఏమన్నా సంఘాలు పెడదామని వచ్చారా?

మోహన్:— లేదండీ- నా కవన్నీ గిట్టవు. రావుతో ఎన్నోసార్లు చెప్పినా నా మాట వినలేదు. మన కెందుకండీ ఇవి. చేస్తే ఉద్యోగం చెయ్యాలి. లేకపోతే దేవుడిచ్చిన ఇంతకొంప్ర సాగుచేయ్యాలి. కాని ఇవి కూటికా గుడ్డకా?

వీరయ్య:— (ఆనందంతో) భేష్. నాయనా భేష్. చదువుకున్నా అల్లా వుండాలి. రైతుబిడ్డనిపించావు. ఈ వూళ్లో ఎవరు నాయనా బంధువులు ?

మోహన్:— అడుగో సంగయ్య వస్తున్నాడు. ఈయన తల్లి మా పెద తండ్రి కూతురులెండి.

సంగ:— (కవరు కనపడేటట్టు పట్టుకొని వస్తాడు.) ఏం బాబాయి! రావు లేడూ ?

వీరయ్య:— ఎందుకూ ?

సంగ:— (తటపటాయిస్తూ ఉత్తరం వంక చూస్తాడు.) ఏమీలేదు....

వీరయ్య:— (అనుమానిస్తూ) ఆ ఉత్తరం ఏంట్రా. ఎవరికి వచ్చింది ?

సంగ: — రావుకే! (నాలుక కొరుక్కుంటాడు.)

వీరయ్య:— ఇలా పడేయి.

మోహన్:— ఇవ్వరాదట్రా. వాళ్ళబ్బాయిదేగా!

సంగ:— (సంకోచిస్తూ) ఏమీ లేదు, నిన్న మా తాతగారి ఊరెళ్ళాను. లక్ష్మయ్యగారి కూతురు మెబ్బాయితో చదువుకుంటుంటగా. ఆమె ఇచ్చింది. రావుకే ఈయమంది. మరేమన్నా తంటావస్తుందేమో....

వీరయ్య:—ఏడ్చావ్! (ఉత్తరం లాక్కొని చింపుతాడు. చూచి) ఇంగ్లీషులో ఏడ్చింది. చదువు నాయనా! (మోహన్ కిస్తాడు.)

మోహన్:— (చదువుతూ నవ్వుతాడు.)

వీరయ్య:— యేముంచిరా అబ్బాయి.

మోహన్:— (నవ్వుతూ) అవి చెప్పదగినవి కాదండీ. ఏదో ప్రేమలేఖ లెండి. ఇంతకూ రావుపెళ్లి తలపెట్టలేదేమిటి ?

వీరయ్య:— (కోపంతో) ఉత్తరాలదాకా వచ్చింది. పీటలమీద పెండ్లి చెడగొట్టిందిగా ఆ మహా ఇల్లాలు. దాన్నితప్పితే చేసికోడట ఈ వెధవ. ఎంత అప్రదిష్ట! ఆడది ఉత్తరాలు రాయడమా ?

మోహన్:— వీరయ్యగారూ! మీ వాడికి స్నేహితుణ్ణి గనుక, వాడి క్షేమం గోరి చెబుతున్నాను. మీ వాడు బొత్తిగా చెడిపోతున్నాడు. మీ అబ్బాయి ప్రాణానికా పాడుముండ సంప్రాప్తించింది. అసలు మన కులానికే అవమానకరం. ఒకటేమిటి? బీచి షికార్లు, సినిమాలు— చాలాదాకా పోయిందిలే.

సంగ:— ఇంతపని అనుకోలేదు బాబాయి. ఏదో స్నేహితులుగదా అనుకుంటే- నన్నే బురిడీ గొట్టించిందే. నా చేత ఉత్తరాలు మోయించిందే—

వీరయ్య:—ఇకనేం. వెళ్ళమను వెధవను. అయింది. అనుకొన్నంత పనీ అయింది. ఇకవెళ్ళమను. పట్నంలేదు. గిట్నంలేదు. రెండుకాళ్లూ కట్టి ఇంట్లో పడేస్తాను. ఇక్కడమాత్రం ఊరుకున్నాడా? మాల మాదిగలకు పురెక్కించడం- (మోహన్‌వంక తిరిగి) నాయనా నీవు మంచివాడివి కాబట్టి వాణ్ణి బాగుచేయాలని ఇంత శ్రమదీసుకొంటున్నావు.

మోహన్:— రావు వస్తాడేమో అనుకొన్నా- రాలేదే. నాకు తొందరపని వుంది. మళ్ళీ ఎప్పుడైనా దర్శనం చేసికొంటాను లెండి. సెలవు! (వెళ్ళుతూ సంగడికి సైగ చేస్తాడు.)

సంగ:—బాబాయి, ఆ పిల్లను చూశావా? మీయింటి కొచ్చిందిగా—

వీరయ్య:— ఇటొచ్చి అటుపోయింది. చూడలేదు. చూచి ఆ పాతకం కూడా కట్టుకోడ మెందుకు?

సంగ:—మా మామ సంకోచించాడుకాని ఇంకా చాలా సంగతులుండాయే. ఉత్త సానివేషం. సాని అలవాట్లూను. మద్రాసులో వీళ్లనాటకాలేడ్చేవారట. అందులో కావలించుకోడం, రామ రామా - నే చెప్పలేనే అవన్నీ. ఇంతకీ అబ్బాయిగారికి కడుపునిండా కూడు దొరుకుతోంది. ఎన్ని వేషాలయినా వేయగలడు..... వెళ్తాను బాబాయి.

వీరయ్య:— (మాట్లాడకు. కొంచెంసేపుండి) యేమేవ్ - వశేవ్ ! (కేక లేస్తాడు; భార్యవస్తుంది) విన్నావా ? విన్నావా అంట ! నా మాటలో ఏమన్నా అబద్ధంవుందా ? రుచిమరిగిన కోడి ఇల్లెక్కి కూసిందట. ఈ వెధవ నామాట ఎందుకువింటాడు. ఇదిగో. వుత్తరాలదాకా వచ్చింది వ్యవహారం. మొన్నవచ్చిందే ఆ పిల్ల.........(అడుగుల చప్పుడు)

రంగమ్మ:— అబ్బా ! వూరుకోండి. వస్తున్నాడు. మీరసలే ముక్కోపులు. (రావు ప్రవేశం) ఏం నాయనా ! ఇంత ఎండెక్కేదాకా వున్నావేం ? పద, స్నానంచేసి భోంచేద్దువుగాని.

వీరయ్య:— అబ్బాయీ ! (కోపంగా చూస్తాడు)

రావు:— ఆఁ.

వీరయ్య:— ఇదేమిటి ? (ఉత్తరంయిచ్చి కఠినంగా చూస్తాడు)

రావు:— (చదివి, ఆశ్చర్యపోతూ) నా కర్థంకావడంలేదు.

వీరయ్య:— ఎందుకర్థం అవుతుందీ ? (నేలమీద కాలు గట్టిగాతన్ని) ఇక ఇల్లు కదిలావా వూరుకునేదిలేదు. ఇప్పటికొచ్చిన అప్రతిష్ట చాలు.

రావు:— ఇదంతా మోసం. వట్టి కల్పన.

వీరయ్య:—అదంతా నాకు తెలియదు. అది అట్లావుండనియ్. నీవు మాల గూడెం వెళ్లొద్దు. వాళ్ళను ఉసికొల్పనూవద్దు. తిన్న యింట్లోను వాసాలు లెక్కపెట్టేస్తున్నావురా. మాకు సంపాదించి తగలేసేది లేదుగాని, కూలి యెక్కువ అడగమని వెంకణ్ణి పంపుతావ్ ? ఏం బుద్ధులురా నీయి. ఏం పోగాలం వచ్చిందిరా నీకు ?

రావు:— నాన్నగారూ ! క్షమించండి. బీదసాదలకు మేలుచేయటమే నా ఆదర్శం. వాళ్ళ హక్కుల్ని కాపాడటమే నా ధర్మం. వాళ్ళ కష్టానికి తగిన ఫలం యివ్వాలా మరి ?

వీరయ్య:— ఏం శ్రీరంగనీతులురా నాయనా ? నీవేనా వుద్ధరించి యేద్చేటట్టు. లోకులబిడ్డని పాడుచేసి.........

రావు:— (కోపంతో) నాన్నా - మర్యాదదక్కదు. అదంతా వట్టి అబద్ధం. ఎవడో కిట్టనివాడు రాసింది. మేము పెళ్ళిచేసుకున్నమాట నిజమే. కాని, అందులో రహస్యం ఏమీలేదు.

రంగమ్మ:— ఊరుకోరా నాయనా! నీవుకూడా....

వీరయ్య:— (భార్యతో) చూశావా! చూశావా అంట, వీడి నీలుగు. నానా గడ్డి తిని పట్నంలో చదువుచెప్పిస్తే. ఎవడికాళ్ళో పట్టుకొని ఇంత వుద్యోగంయేద్చి, తల్లీ - తండ్రి చెప్పినట్లు వినుకోవాల్సిందిపోయి, ఎదిరిస్తున్నాడు వెధవ! మర్యాద దక్కదట. ఏంచేస్తావురా పక్షీ? (భార్యవంక తిరిగి) వీడా సంఘాన్ని ముదమ్మతు చేసేది? వీడా త్యాగి? వీడా దేశాన్ని ఉద్ధరించేది? చూడరా మొఖం. అహాఁ. చూద్ధు - థూ - (ఊస్తాడు) అవతలికిపో - నాయింట్లో కాలుపెట్టకు. (గెంటుతాడు - తల్లి అడ్డుకొంటుంది)

రావు:— అమ్మా! ఏడవకు. రోజూ యీ అర్థంలేని గోల యికవుండదు. నాన్న దేశసేవకు అవకాశంయిచ్చాడు. మరి సెలవు!

(వెళ్ళిపోతాడు - తల్లి యేడుస్తూ వెంబడిపడుతుంది. వీరయ్య పిచ్చెక్కినవాడిలా తిరుగుతుంటాడు.)

— తెర —

# అయిదో రంగం

[మోహన్ ప్రవేశం. గాంధీటోపీ, లాల్చీ, కొంకెకర్రా-క్రొత్తవేషం]

మోహన్:— (అటూ ఇటూ తిరుగుతూ) సంగా!

సంగ:—(లోపలనుండి) మామా!

మోహన్:— సంగా! ఓరిసంగా! హోరి...

సంగ:— మామయ్యోయ్! యేంటి మామా (అని అరుచుకొంటూ వస్తాడు)

మోహ:— లాభం లేదురా.

సంగ:— లాభం లేదండి మామగారు.

మోహన్:— యేం లాభంలేదేమిటి? నీమొఖం.

సంగ:— అదేనండి.

మోహ:— అదేమిట్రా.

సంగ:— చెప్పనా- చెప్పనా- (తల గోక్కుంటూ) సిగెరెట్ (ఆగి) ఏది మామా.

మోహన్:— ఏడ్చావ్! నీలాంటి దరిద్రులు దొరకబట్టే మన సంఘాల్లో ఒక్కడూ చేరడంలేదు. రావు చూడు ఎలా చొచ్చుకుపోతున్నాడో. వక్కనాధుడు కూడా తీగలు తెంపేవాడు, పట్టాలు పీకేవాడు కన్పడ డాయె. ఆ ముసలివాడు వూరుకోలేక వైస్రాయికి లేనిపోని ఉత్తరాలు ఏడ్చాడాయె. అది బాగా రావుకు లోకువ దొరికింది. యీ సుబాసు మనోడు. ఇదిగో వస్తున్నాం, అదిగో వస్తున్నాం, పొడి చేస్తాం అని అంటాడేకాని వూడిపడడాయె. ఆ రావ్‌మీద ఎన్నని కల్పించనూ, అల్లిబొల్లి కబుర్లు? మన మాట విని చావ్వొద్దూ ఇన్నివేషాలు వేసినా.... ...

సంగః— మామా! ఇందాకటినుంచి గమనించలేదు! భలేగావుంది.

మోహన్:— ఏమిట్రా?

సంగః— వేషం అంటే అట్లావుండాలి. పగటివేషగాళ్ళు కూడా ఇంత చక్కగా వెయ్యగలరా మామా!

మోహన్:— ఏడ్చావుగాని. ఆ రామదాసేడి? కొద్దిగా మనవలలో పడ్డాడు.

సంగః— పడటమేమిటి? ఇదివరలా, ఇల్లు కదలక కూర్చుంటున్నా డను కొన్నావా? భలే హుషారుగా వున్నాడు. ఇపుడే వస్తానన్నాడే! ఇంకా రాలేదెందుకు చెప్మా!

మోహన్:— దాసు సహాయం లేకపోతే మనని అతీపతీ చూచేవాడే లేడు. కాంగ్రెసు బురఖా తగిలించుకోపోతే లాభం ఉండేదికాదు. మనకి డబ్బూ దస్కం- బాంబులు, పిస్తోళ్ళు వస్తున్నాయిగాని మనుషులే దొరకడం లేదురా? దాసులాంటి వాళ్ళింకా మనలో కలిస్తే బాగుం టుందిరా.

సంగః— బాగానే వుంటుంది.

మోహన్:— ఏమిటి?

సంగః— సిగరెట్——ఏదీ మామా!

మోహన్:— అరేయి సిగరెట్ అంటే జ్ఞాపకం వచ్చింది. చూడు ఇక్కడ ఎవరన్నా వున్నారేమో?

సంగః— (అటు చూచి) ఇంత ప్రదేశంలో ఒక్క నరపురుగుకూడా లేదు మామా!

మోహన్:— నాదగ్గర సిగెరెట్ బాంబు, నిప్పెట్టి బాంబులున్నాయి. ఇన్నాళ్ల దాకా నా మీద అంత నిగాలేదుకాని ఈ మధ్య నిగా ఎక్కువైంది. ఇవెక్కడైనా దాయాలిరా. నిన్నెవడూ ఎరుగడు!

సంగః— అలాగే. కాని మామా........

ాన్:—దడుస్తావేంటిరా- ఇదిగో పైకం-(నోట్లు ఇస్తాడు.) జాగ్రత్త. గోడకు కూడా చెవులుంటాయి. ఎక్కడైనా వాగేవ్. నీ ప్రాణం తీస్తా.

— నాకు తెలియదూ- ఏంజెయ్యమన్నా చేస్తాకాని, జైలంటే నాకు గిట్టదు.

ాన్:— అవి భద్రంగా దాచి, దాసును పంపు.

— అలాగే- (వెళ్ళబోతూ) అడుగో దాసు రానేవస్తున్నాడు. నేనిక వెళతాను- మరచిపోయాను. అసలు సిగరెట్-

మోహన్ సిగరెట్ ఇస్తాడు. సంగడు వెళ్ళిపోతాడు. దాసు ప్రవేశం)

న్:— నమస్కారం అండీ.

— నమస్కారం.

ాన్:— ఏమండీ! విశేషాలేమిటి?

— ఏమున్నది, నిన్నటిదాకా మీరు చెప్పినట్లు చేశాను. కాని నాకింకా మనస్సులో వేధించుతోంది. ఈ రహస్యయంత్రం, కాగితాలూ, మందులూ, మాకులూ కాంగ్రెసు కెప్పుడూ లేవు. సరోజిని, దేశ భక్త వెంకటప్పయ్యగార్ల స్టేట్‌మెంటులు చూచాక, నాకు కాళ్లూ, చేతులు ఆడటంలేదు. రావుతో మాట్లాడాను. అతనికి జవాబు చెప్ప లేకపోయాను. యదార్థం కాదనడం ఎలా?

న్:— అంత నిరుత్సాహపడితే ఎలా? మన నాయకులు ప్రకటనలు చేశారంటే, అదంతా డిప్లమొసీ.

— ఏమో? అదీగాక అన్నిచోట్ల మిత్రరాజ్యాలు గెలుస్తున్నాయి. రష్యాలో హిట్లర్ని చావదన్నుతున్నారు.)

న్:— (రష్యాసంగతి మనకు తెలియదటండీ? మొన్నమొన్నటిదాకా వెనక్కిపోయిన రష్యా ఇప్పుడు యెలా గెలుస్తుందనుకున్నారు? రష్యాకు జర్మనీకి సంధి జరిగింది. అది కాస్తా ఎప్పుడో బయట

పడుతుంది. రష్యా గెలవడం మనకీ యిష్టమేగా. రష్యా గెలవన్నా గెలుస్తుంది; హిట్లరుతో కలసి ఇంగ్లీషువాడిని చావదన్నమాతంతుంది;

దాసు:— నమ్మడానికి శక్యంగాలేదు. సంధే జరిగితే అమెరికా - ఇంగ్లండు లకే తెలియదంటారా ? మనందరికీ తెలిసింది వాళ్ళకెందుకు తెలియదు? సంధేజరిగితే హిట్లరు వేలకు వేలు తనసైన్యాల్ని, టాంకుల్ని, విమానాల్ని రష్యాలో బలిపెట్టడందేనికి ? అదలావుంచు. జపాను కూడా చావు దెబ్బలు తింటోంది.

మోహన్:— అలాఅనకు. సుబాసుబాబు రోజూ రేడియోలో చెప్పడంలా ? ఢిల్లీ కోటపైన కాంగ్రెసుజండా పెడతాడట.

దాసు:— అవన్నీ కోతలుగావున్నాయ్. మొన్నటిదాకా మనం చైనాకు సాయం చేశాంగదా. మన డాక్టర్లుకూడా పోయి అక్కడ సేవచేసి చచ్చారుగదా ? ఈనాడు బోసు చైనానుకూడ జపానులో కలవమంటున్నాడే, మనం ఏ ముఖంపెట్టుకొని మిగతా కాంగ్రెసువాళ్ళతో చైనాకు వ్యతిరేకంగా మాట్లాడగలం ? అదీగాక జంగ్-కే-షేక్ ఇండియాకు స్వరాజ్య మివ్వమన్నాడు. ఎంతో అవస్థపడుతున్నా కూడా బెంగాలుకు చైనా డబ్బు పంపిందే. అలాంటి చైనామీద విరుచుకుపడే బోసును సపోర్టుచేయాలంటే నాకే నోరు రావడం లేదు. అందులోనూ మద్రాసుమీద, కలకత్తామీద బాంబులువేశాక అందరూ నోట్లో వూసేవాళ్ళే. అమాయక ప్రజలమీదనా బోసుగారి పరితాపం అంటున్నారు.

మోహన్:— చైనా - రష్యాల గొడవెందుకయ్యా. మన దేశం సంగతి చూద్దాం. ఈ ఇంగ్లీషువాణ్ణి పోగొట్టాలంటావా ? లేదా ? అందుకు కొంతమంది చావక తప్పదు.

దాసు:— ఎలా పోగొడతాం. పట్టాలుపీకి, తీగెలు తెగగొట్టడానికి ప్రజలు ముందుకు రావడంలేదుగదా ? పోనీ, గవర్నమెంటు పనులకడ్డం కొడదామనుకొందాం. వేటిని అడ్డుకొందాం ? దేశ రక్షణనా ? అది

కోత్పత్తినా? ఆహారసమస్యలోనా? మొన్న తోళ్ళ ఫ్యాక్టరీలో యేదో తగాదావస్తే సమ్మెచేయిద్దామని పోయాను. 90 ఏళ్ళ ముసలమ్మకి జవాబు చెప్పలేకపోయాను. అది అందికదా! "నా కొడుకులు యుద్ధంలోకి వెళ్ళారు. ఎక్కడెక్కడో యుద్ధం చేస్తున్నారు. ఈ ఫ్యాక్టరీని గవర్నమెంటు కాంట్రాక్టు తీసుకుంది. దీనిలో బూట్లు సైన్యాలకి పోతాయి. మీరు సమ్మెచేస్తే, బూట్లు తయారుకాకపోతే నష్టపడేదెవరు? నా కొడుకులు; నావలెనే బిడ్డల్ని సైన్యాలకు పంపిన మీరు." ఇంకెవరూ మాట్లాడలేదు. సమ్మె జరగలేదు.

మోహన్:— అయితే మీరేమంటారు ఇంతకూ?

దాసు:— ఏమీలేదు. అలాగే రైతుల్ని ఎందుకయ్యా యీ బంజర్లలోపడి రెక్కలు విరగగొట్టుకోవడం అన్నాను. బెంగాల్, రాయలసీమ, మలబారులు మాడిచస్తుంటే అధికాహారోత్పత్తి వద్దంటావేమయ్యా. చచ్చేది మనవాళ్లు. రక్షించాల్సింది మన ప్రజల్ని, గాంధీగారుసైతం ఏమన్నారు? "ఆకలిగొన్నవానికి భగవంతుడు కన్పడితే అన్నం రూపంలోనే కన్పడతాడట" - ఇలా అంటుంటే నేనేం సమాధానం చెప్పేది?

మోహన్:— ఇంతకూ మీరు రావు వలలో పడ్డారన్నమాట!

దాసు:— వలలో పడటమేమిటి? నేనింకా యేదీ నిశ్చయించుకోలేకుండా ఉన్నాను. సాయంత్రం మీటింగు జరుగుతుంది. రావు వుపన్యాసం వుంది. అదికూడా వినిగాని నేనేమీ చెప్పలేను. కాని ఒక్కమాట మాత్రం నిజం. నీ రహస్యాలు ఒక్కటీ చచ్చినా ఎవరికీచెప్పను. అందునుగురించి నీవు భయపడనక్కర్లేదు.

మోహన్:— నేనూ వస్తాను మీటింగుకు. నేనూ మాట్లాడతాను. రావుపస ఏమిటో ఇవ్వాళ తేలిపోవాలి. (ఇద్దరూ నిష్క్రమించుతారు)

— తెర —

# ఆరో రంగం

[మీటింగు స్థలం. అధ్యక్షుడు కూర్చుని వుంటాడు. రావు, సుగుణ, మరి కొందరు బాలబాలికలు పాడటానికి సిద్ధంగా వుంటారు. ప్రేక్షకులలో మోహన్, దాసు, సంగయ్య ఉంటారు.]

సుగుణ, రావు, బాలబాలికలు:—

పాట

ఎగురవేయి, భారత భువిపై ఎఱ్ఱపతాకము
ఎగురవేయి, భారత భువిపై విజయపతాకము॥
దేశరక్షణ దీక్షబూనె - ఉడుకురక్తపు యువకుల్లారా!
దేశరక్షణ దీక్షబూనె - ఉరికివచ్చే యువతుల్లారా!:
సమయమిదేగా - సగగున రాగా
వినాశమొ విజయమొ వెనుతిరుగనేలా?
ధాటి జూపే మేటి వీరత, శూరత, ధీరతచాటగ
రయమున జయమొంద - రణమున కీవె రావోయీ!
అదిగో - కనవోయీ - చనవోయీ -
దేశ విముక్తికి, దీక్షతో
మిత్రులజేర్చి, శత్రుల చీల్చి - మిలమిల
మింటను మెరిసే జండా!
ఇలపై మనజండా - పిలుపిచ్చుచునుండా
పరుగున ఉరుకుము - పగతుర నరుకుము॥ ఎగు॥

అధ్యక్షుడు:— మిత్రులారా ! ఇపుడు రావుగారు మాట్లాడతారు,

మోహన్:— (లేచి) అధ్యక్షమహాశయా ! మాకు కొన్ని సందేహాలున్నాయి. తీర్చాలి.

అధ్య:— అలాగే. కాని మొదట రావుగారి ఉపన్యాసం ముగించే వరకు మీరు మాట్లాడకూడదు. చివరికి ప్రశ్నలకు సమాధానం ఇస్తాం.

సంగ:— చివరకి కాదు. ఇప్పుడే ఈయాలి.

ప్రజలలో ఒకరు:— ఎవడ్రా వాడు.

అధ్య:— హుష్. నిశ్శబ్దం. ప్రశ్నలకు తప్పక సమాధానం ఇస్తాం.

దాసు:— మాకు కావలసిందది. ఎప్పుడిస్తేనేం. సంగయ్యా ! ఊరుకో. ముందు ఉపన్యాసం విను.

మోహన్;— (దాసుతో నెమ్మదిగా) ఏడ్చినట్లే వుంది మీ వైఖరి.

రావు:— (ఉపన్యాసం ప్రారంభించుతాడు.)

అధ్యక్షా, మహాశయులారా !

ప్రపంచం నేడు రెండు పార్టీలుగాచీలి యుద్ధం చేస్తూవుంది. సోవియటు రష్యా, చైనా, ఇంగ్లాండు, అమెరికా ప్రజలు ఒకవైపు; జపాను, జర్మనీలు మరొకవైపు. మొదటిపక్షం గెలవాలని మనం కోరుతాం. కాంగ్రెసు నాయకులుకూడా కోరారు. దానికోసం జాతీయ ప్రభుత్వపు అవసరాన్ని కమ్యూనిస్టులం, కాంగ్రెసూ ఇరువురమూ గుర్తించాం. కాని ఇంగ్లీషు ప్రభుత్వం మనకు జాతీయ ప్రభుత్వాన్ని ఇవ్వకపోతే సత్యాగ్రహం చేస్తామని కాంగ్రెసు తీర్మానించింది. దీన్ని అవకాశంగా తీసుకొని బ్రిటిషు ప్రభుత్వం కాంగ్రెసు నాయకులను అరెస్టుచేసింది. తరువాత జరిగిన విధ్వంసక చర్యలు కాంగ్రెసు కార్యక్రమం కాదు. అయినా కాంగ్రెసు అలాంటి తీర్మానం చేయడం తప్పనీ, యుద్ధానికి అనుకూలంగా పనిచేస్తూ, మన ప్రజల బలాన్ని అభివృద్ధిచేసి, జాతీయ ప్రభుత్వాన్ని సంపాదించాలనీ, ఇదొక్కటే నేడు మన స్వాతంత్ర్యపోరాటాన్ని ముందుకు తీసుకుపోగల మార్గమనీ కమ్యూనిస్టులం ప్రచారం చేస్తున్నాం. ప్రజలకు,

సైన్యాలకు కావలసిన ఆహారాన్ని పండించాలి; పండించిన ఆహారాన్ని, ప్రజలకు కావలసిన అవసర వస్తువులను కంట్రోలుచేయించాలి; తిండిదొంగ లకు ధాన్యం అమ్మవద్దు; ప్రభుత్వానికే అమ్మి దేశంలో కరువు కాటకాలు రాకుండా చేసుకోవాలి దీనికి కావలసిన ఆహార కమిటీలు, ప్రజా రక్షణ దళాలు ఏర్పాటు చేయాలి. కాంగ్రెసు సోషలిస్టు పార్టీ. ఫార్వర్డు బ్లాకు మొదలగు పంచమాంగ దళంవారు యుద్ధానికి వ్యతిరేకంగా, జపానుకు అనుకూలంగా చేసే ప్రచారాన్ని, పనులను అరికట్టాలి: జాతుల స్వయం నిర్ణయాధికారాన్ని అంగీకరింపజేసి, కాంగ్రెసు - లీగ్ ఐక్యతను ఏర్పర చాలి; కాంగ్రెసు నాయకులను విడుదల చేయించుకోవాలి: జాతీయ ప్రభు త్వమును స్థాపించుకోవాలి."

మోహన్:- (గట్టిగా అరుస్తూ) సోదరులారా! రావు మిమ్మల్ని మోసగిస్తు న్నాడు. ఇతడు ప్రభుత్వపు ఏజంటు. ధాన్యం ప్రభుత్వానికి అమ్మ మంటున్నాడు. కాంగ్రెసువాళ్ళని పంచమాంగదళం అంటున్నాడు. (కలకలం).

అధ్య:— నిశ్శబ్దం, మోహన్‌గారు కూర్చోండి. మీ సందేహాలకు తర్వాత....

మోహన్:— అధ్యక్షుడు నన్నవమానిస్తున్నాడు. నామాట నమ్మండి. జాతీయ రైతు సంఘాలలో చేరండి !

ప్రజలలో ఒకరు:— వుండేయి వుండగా నీ దేమిటోయ్, పేత్రా. కూర్చో. కూర్చో. దెబ్బలాటలు పెట్టడానికి వచ్చావు.

మోహన్:— రావు వట్టి వెధవ. చూడండి. ఆ అమ్మాయి రావు కేమవు తుందో కనుక్కోండి.

ప్రజలు:— (మోహన్ మీదికి ఉరుకుతారు, అంతా లేస్తారు.)

దాసు:— కూర్చోండి ! కూర్చోండి. ఏమిటీ వెధవ ప్రశ్నలు.

మోహన్:— సంగా !

(సంగడు రావు తల బ్రద్దలు కొడతాడు. నెత్తురు కారుతుంది. మోహన్, సంగయ్య పారిపోతారు. కొందరు కట్టుకడతారు.)

దాసు:- (లేచి) అయ్యా! ఈ అల్లరులతో, నాకూ, మా కాంగ్రెసువాళ్ళకూ ఎట్టి సంబంధం లేదు. నేను కొన్నిసందేహాలు కల్గివున్నమాట నిజమే. కాని రావు ఉపన్యాసం బాగా నచ్చింది. మోహన్ చేసిన అల్లరీ అగాయిత్యంవల్ల, వాళ్ళకు అల్లరితప్ప మరో కార్యక్రమం లేదని స్పష్టపడింది. రావుకు దెబ్బ తగిలినందుకు నేను విచారిస్తు న్నాను. మీ రుద్రేకపడినందువల్ల లాభంలేదు. శాంతించండి. నేను మీకు ఒక సంతోషవార్త చెబుతాను. నేనిదివరదాకా తప్పుద్రోవను పట్టాను. నేడు రావు చూపుతున్న కార్యక్రమమే దేశానికి మోక్షం తెస్తుందని విశ్వసిస్తున్నాను. (జై. కాంగ్రెసుకు జై, కమ్యూనిస్టులకూ జై.)

(సభ ముగుస్తుంది.)

— తెర —

# ఏడో రంగం

(వీరయ్య - రంగమ్మల ప్రవేశం)

వీరయ్య:— చూశావా? రిజిస్టరయిపోయిందంట.

రంగమ్మ:— అప్పుడే ఫైసలయిందటండీ.

వీరయ్య:— ఆఁ. ఫైసలా అయింది.

రంగమ్మ:— నేనుచెప్పడంలా. ఇంకాతగ్గుతాడు. ఇంకా లొంగుతాడు అనే కాని, ఆచేనుకాస్తా....

వీరయ్య:— చేనేమిటి నీముఖం. నా కొంపకాస్తా కూలిస్తేను.

రంగమ్మ:— మరేమిటండీ

వీరయ్య:— చేను రిజస్టరుకాదే. నీబొంద....అబ్బాయి రిజస్టరు పెళ్ళిచేసి కొన్నాడట

రంగమ్మ:— పెళ్ళి రిజస్టరేంటండీ, మీ దంతా చోద్యం. దీనికూ్కడా సాక్షి లుంటారా! (నవ్వుతుంది.)

వీరయ్య:— నీకు నవ్వు ఎట్లావస్తావుందే. నా పరువుకాస్తా తీసేస్తేనువాడు. సాక్ష్యం ఉండరూ? ఉంటారు. ఆదాసుగారు, ఆపిల్లతండ్రి సాక్ష్యం ఉన్నారట.

రంగమ:— ఏదో నవ్వుతున్నారనుకొన్నాను. సలక్షణంగా వాడు కోరినట్లు పెళ్ళిచేస్తే మీదేంపోయేది. ఇంతకీ నాయి పాపిష్టికళ్ళు. నాకా రాత లేదు. ముచ్చటగా 5 రోజులు పెళ్ళి చేద్దామనుకున్నాను.

(కంటినీళ్ళు తుడుచుకొంటుంది.)

ఒకరు:— (ప్రవేశించి) అత్తయ్యా! ఆ వూళ్ళో మీటింగులో అబ్బాయితల బద్దలుకొట్టారట. రక్తం కారుతోంది. (వెళ్ళిపోతాడు.)

రంగమ్మ:— ఆఁ. ఆఁ. నెత్తురే! ఎవరికేం పోగాలంవచ్చిందిరా మావాణ్ణి కొట్టడానికి.

వీరయ్య:— కొట్టారూ. ఊళ్ళో సమస్యలన్నీ వాడివేనయ్యే. ఇంట్లోతిని కూర్చోలేక వెధవ! కావాల్సిందే శాస్తి.

రంగమ్మ:— నేను వెళ్ళి వస్తాను. అబ్బాయిని చూసి వస్తాను. బ్రతుకుతాడో లేదో?

వీరయ్య:— ఇంతమాత్రానికే చస్తాడూ? మనన్నందర్నీ చంపి మరీ చస్తాడు. నీవు వెళ్ళడానికి వీలులేదు. మాదిగ గూడాలకు అబ్బాయి పోయింది చాలదూ. నీవుకూడా పోవాలీ.

రంగమ్మ:— నేను పోయితీరాలి. (పోబోతుంది,)

వీరయ్య:— మాదిగముండకానా! ఎక్కడికి? ఇంట్లోకి పదవేం. మాదిగ వెధవను చూట్టానికి సిగ్గులేదూ? పో లోపలికి (జుట్టుబట్టుకొని ఇంట్లోకి లాగుతాడు.)

— తెర —

# ఎనిమిదో రంగం

(వీరయ్య ఇల్లు. నులకమంచంమీద పక్క- జబ్బుతో భార్యాపడి వుండి వుంటుంది. వీరయ్య అటూ ఇటూ తిరుగుతూ వుంటాడు.)

వీరయ్య:— ఆఁ. ఏమిటే గొణుగుతున్నావు. త్యాగి. ఏంత్యాగి? ఇల్లూ వాకిలి వదలిపెట్టడం, తల్లీ తండ్రిని వదలిపెట్టడం ఇదేనా త్యాగం? త్యాగిఅట త్యాగి.

(ఇంతలోకే డాక్టరు, కాంపౌండరూ వస్తారు.)

వీరయ్య:— నమస్కారంఅండి

డాక్టరు:— నమస్కారం (పరీక్షచేసి చప్పుడిస్తాడు.)

వీరయ్య:— అయ్యా! డాక్టరుగారూ మాట్లాడరేం.

డాక్టర్: ఊఁ. మరి....

వీరయ్య:— చిత్తం

డాక్టరు:— మీకొకమాట చెబుతాను. కోపంలేదుకదా.

వీరయ్య:— అబ్బే! కోపంఅనేది నా ఇంటావంటా లేందే

కాంపౌండరు: అవునండి. వీరయ్యగారికి నల్లికుట్టినా కోపంరాదండి.

వీరయ్య:— (కోపంతో) చాల్లేవయ్యా సరసం!

డాక్టరు:— నిశ్శబ్దం. అవతల రోగి....

వీరయ్య:— (శాంతంగా) ఇంతకూ ఏమంటారు,

డాక్టరు:— కొడుకుమీద బెంగపెట్టుకొని ఈ స్థితికి వచ్చింది. మనోవ్యాధికి మందేమిటయ్యా. అబ్బాయిని తీసుకురండి. తర్వాత చూస్తాను.

(డాక్టరూ కాంపౌడరూ వెళ్ళిపోతారు.)

వీరయ్య:— అబ్బాయిని తీసుకురావడమా ? బెంగట. మందులేదట. వీడి మొఖం. ఏండాక్టరు పాసయ్యాడు. వీడికంటే మంగలి అప్పుడు నయం. కుప్పికట్టి వైద్యం చేయిస్తాను. (అటూ ఇటూ తిరుగుతూ భార్యవంక చూస్తూ వుంటాడు. కొంతసేపాగి) కొంపదీసి ఈ డాక్ట రన్నది నిజంకాదుకదా ?

(రావు సుగుణల ప్రవేశం.)

వీరయ్య:— (కోపంగా) ఎందుకొచ్చావురా ?

రావు:— అమ్మ నామీద బెంగపెట్టుకొందని....

రంగమ్మ:— నాయినా ! వచ్చావా ! వచ్చావా !

(ఉద్రేకంతో ఆయాస పడుతుంది.)

వీరయ్య:— ఇన్నాళ్ళనుంచి అమ్మ జ్ఞాపకం లేదేం.

రావు:— నీవు రానిస్తేనా ? (తల్లిదగ్గరకు వెళ్ళతాడు. తల్లి మూల్గి చనిపో తుంది.)

రావు:— (తల్లి శవంవంక జూచి) అమ్మా ! అమ్మా !!....

సుగుణ:— ఇంకెక్కడి అమ్మ ! చచ్చిపోయింది.

వీరయ్య:— ఆఁ ఆఁ చచ్చిపోయిందా-(దగ్గరకువచ్చి చూచి తలమీద ముసుగు వేసుకొని నిశ్చేష్టుడై నిలబడతాడు.)

రావు:— నాన్నా ! అమ్మను చంపేశావు. నాకోసం బెంగపడి చచ్చిపోయింది. నీకు హృదయంలేదు,

సుగుణ:— రావు, ఏంమాటలివి. ఇదేనా సమయం. (వీరయ్యతో) ఏదో కోపంతో అన్నాడులెండి. లెక్కచేయకండి. ఎవరికైనా వుంటాయి కోపతాపాలు,

వీరయ్య:— నాయనా ! (అపురుమని కుమారుని కౌగలించుకొంటాడు. కళ్ళవెంబడి నీరు.)

సుగుణ:— (రంగమ్మ శవంమీద గుడ్డకప్పుతూ వుంటుంది.)

— తెర —

# తొమ్మిదోరంగం

మోహన్:— (సిగరెట్ కాల్చుకుంటూ ప్రవేశం) లాభంలేదు. ఇక మళ్ళీ పట్నంపోయి ఖాళీగా కూచుంటే మంచిది.

సంగ:— (ప్రవేశం) యేం మామా! ఇవాళ పొద్దుణ్ణుంచి కాఫీకి డబ్బుల్లేవు. నీవు నామీద శీతకన్ను వేశావు.

మోహన్:— పోరా బడుద్ధాయ్! తిండిపోతు వెధవవు. నీలాంటివాళ్ళు దొరకబట్టే నాపని యిలా అయింది. ఇక్కడంతా వుత్త బడుద్ధాయీలు. అందుకనే నేను జాతీయ సంఘాలకి రాజీనామా ఇచ్చాను.

సంగ:— ఆఁ. రాజీనామాలో ఏమని రాశావుమామా?

మోహన్:— ఇదిగో! పత్రికలో వుంది. చదువు.

సంగ:— (చదువుతూ) "దేశంపట్ల భారమధికం కావడంవల్ల నేనీ పదవికి రాజీనామా ఇస్తున్నాను" అదేంటిమామా! దేశానికి భారమయ్యావా?

మోహన్:— ఏడ్చావు వెధవ! నోరుమూయ్.

సంగ:— ఇకనేంచేస్తావు మామా!

మోహన్:— పట్నం పోతాను.

సంగ:— నన్నుకూడా తీసుకుపో మామా!

మోహన్:— నువ్వెందుకోయ్! పానకంలో పుడకలాగా. సన్యాసి వెధవవు.

సంగ:— తప్పదు మామా!

మోహన్:— ఎందుకురా తద్దినం. పిల్లిని చంకబెట్టుక వెళ్ళినట్లు. అందులో పట్నంలో నీవేంచెయ్యను?

సంగ:— ఏంటిమామా! అలాగంటావ్? నీవు తీగెలు తెంపమంటే తెంపే శాను. వుత్తరాలడబ్బాలో సిగరెట్టుపీక పడెయ్యమంటే పడేశాను. వీరయ్యకు కొడుకుమీద చాడీలుచెప్పి మనస్సు విరిచాను. రావు తలకాయ బద్దలుకొట్టిందీ నేనేకదా!

మోహన్:— అన్నీ: ఏడ్చావ్! పెళ్ళాం చావడంతో వీరయ్యకూడా కొడుకులో కలిశాడు.

సంగ:— నిన్ను వదిలితే ఈ వూళ్లో నాముఖం చూచేదెవడు మామా! నీ దగ్గరే ఇంత పనోపాటోచేసి బ్రతుకుతాను,

మోహన్:— నాదగ్గరేముందోయ్ ముండ!

సంగ:— ఏంటీ? నేను ముండనా? (కోపంవస్తుంచికాని అణచుకొని) సిగరెట్ యేదీ?

మోహన్:— ఇక నీకు సిగరెట్టు యివ్వడంకూడా దండగే. పోరా గంటస్తంభం?

సంగ:— (తెగించి) నీ విచ్చేదేమిటోయ్? (అని జేబులో చేయిపెడతాడు)

మోహన్:— (లెంపకాయ కొడతాడు)

సంగ:— కొడతావుగా? (చొక్కా మడుస్తాడు)

మోహన్:— ఓహో! ఏమిటోయ్! ఆ పొగరు? (రెండో లెంపకాయ కొడతాడు)

సంగ:— (మీద కలియపడతాడు. ఇద్దరూకలిసి క్రిందపడి పెనుగులాడుతుంటారు.)

ఒకడు:— (ప్రవేశించి) ఇదేంటిరా సంగయ్యా! మీ యిల్లు పోలీసోళ్లు చుట్టేశారు. (అని వెళ్ళిపోతాడు)

సంగ:—<br>
మోహన్:— } (ఆఁ. అంటూలేచి దులపరించుకుంటారు.)

మోహన్!— సంగా! ఏం జరిగిందంటరా ? ఆ బాంబులంజాళ్ళు ? ఎవరి
తోను వాగలేదుకదా ?

సంగ:— ఏం ? ఇప్పుడు కావల్సివచ్చిందేం నేను.

మోహన్:— (గడ్డంపట్టుకొని) ఒరేయ్! ఏదో పొరపాటు జరిగిందిలేర్రా ? చప్పున చెప్పు. మనం ఎటన్నా పారిపోవాలి.

సంగ:— (తలగోక్కుంటూ) ఏమీలేదు కాని.... మొన్న - నా ముండలేదూ? భోగం రత్తం - అదేదో తలతిక్కగా వాగితే, బాంబుబెట్టి నీ తలకాయ బద్దలుగొడతానని బెదరించాను. అయినా అది చెప్పివుండదే? మంచి ముండ!

మోహన్:— నా కొంప ముంచావురా ? ఎక్కడికైనా పరుగెత్తాలిరా.

సంగ:— ఎటు ?

మోహ:— ఇటూ. (అంటూ పరుగెత్తుతాడు)

(పోలీసులు ఎదురువచ్చి ఇద్దర్నీ అరెస్టుచేస్తారు.)

— తెర —

చేతనైతే మీరు గూడా ఆయా సంఘాలలో చేరి పనిచేయండి. లేదా మాట్లాడక ఊరుకొండి. ఇదే నా మనవి"- అని చెప్పేస్తాను.

రావు:— నాన్నగారూ! మీకిది తెలుసా? సుగుణ నాన్న వస్తున్నాడు రేపు.

వీరయ్య:— అలాగా! అయితే రేపొక విందు ఏర్పాటుచేయి. మీ కామ్రేడ్స్ నందరిని పిలువు. వెంకణ్ణికూడా. మీ పెళ్ళి రిజిష్టరయింది. కాని ఆ పెళ్ళి సందర్భంలో వేడుకలు జరగలేదు. ఆ సందర్భలోనే ఈ విందు అని అందరికీ చెప్పాలి.

రావు:— (సంతోషంగా) నాన్నగా రెంతమారిపోయారు! అలాగే.

సుగుణ:— భోజనాలకు లేద్దామా?

వీరయ్య:— లేద్దాంగాని అమ్మాయి! అదేదో పాట- బెంగాలు కరువుమీద వుంది. ఒకసారి పాడు-

సుగుణ:— (పాడుతూ వుంటుంది. రావు చిటికలు వేస్తుంటాడు. వీరయ్య తల వూపుతూ వుంటాడు.)

పాట

జాగేల చేసెదరు ప్రజలారా
ప్రళయము పుట్టెను వంగదేశమున॥ జా॥
అన్నమో అన్నమో యని అల్లాడు చుండిరి జనులూ
వేనకు వేలూ చచ్చుచునుండిరి॥ జాగే॥

తోచిన సాయము చేయగరండీ
దాచిన ధాన్యము బయటకు లాగండీ
తిండిదొంగలను దండించండీ
రండి! ఆహార కమిటీలలో చేరండీ॥ జాగే॥

— తెర —

[నాటక ప్రారంభానికిముందు ఒకరు జండాపుచ్చుకొని స్టేజీ మధ్యలో నిలబడి ఈ పాట పాడాలి. తక్కిన నటకులు సైడ్సులోనుండి పాటను అందుకోవాలి. జండా: ఎర్రజండాపై నక్షత్రమూ, ప్రజావిజ్ఞాన ప్రచారమండలి అనే అక్షరాలుండాలి. పాట పాడినతర్వాత తెర పడుతుంది.]

పా ట

(బ్యాండ్ మెట్టు—త్రితాళ్)

ప్రజాసేవయే మా జీవితాశయం
ప్రజల శక్తియే మా ఉక్కు కవచమూ

విజ్ఞాన ప్రచారమే మా ముఖ్య సూత్రమూ
హావ భావ నటనమే మా ముఖ్య సాధనం

శాంతి స్వాతంత్ర్యం
అభ్యుదయములూ
మా వెలుగు చుక్కలూ
మా జీవితాశయం
జై జై జై జై జై ॥